# జీవలి

## బాల్యవైవాహికోత్సవ శరణ్యదేశము

మనహైద్రాబాదు రాష్ట్రముకూడ!

అయ్యా,

బ్రిటిషు ఇండియాలో శారదాచట్టమును బహిరంగముగా ప్రతిఘటింప సాహసములేని పరిశివారదేశములు నిజాంరాష్ట్రము సరిహద్దులలో నే ఆటంకము లేకుండ తమ ముస్కాపస్బాలగని పనికూనలను ఇక్కడికి వచ్చి వివాహములు చేసి కొనిపోవుచున్నారు. మనరాష్ట్రములో శారదా చట్టముకూడ నుండిన యీ సనాతనుల నాటక ప్రదర్శనము మనసరిహద్దులలో జరుగకుండెడిది. ఇప్పుడు మధిర, భద్రాచలము, పాల్వంచ, అలంపూరు, మంథెనమున్నగు ప్రాంతములలో బ్రిటిషిండియా వార నేక బాల్యవివాహములు చేయుచున్నారు. నిజాం ప్రభుత్వమువారు శారదాశాసనమైన చేయవలెను. లేదా అట్టి విదేశీయ వివాహముల నిషేధింపవలెను. లేదా కరోడిగిరీ మహసూలువలె పెండ్లికి ౧౦౦ రూపాయిలచొప్పున పెండ్లిసుంకమైన వసూలుచేయవలెను. ఈప్రకారము మేము సరిహద్దు జాగీరులో జరుగుచున్నదనియు ఆజాగీర్దారునికి జాగీరుమసూలుకన్న ఈవసూలు పదంతలు వసూలగుచున్నదనియు వింటిని. మొత్తముపై బ్రిటిషు ఇండియాకువలె మనరాష్ట్రము శాసనబద్ధము కాకయుండుట, శాసనతిరస్కారులకు శరణ్యముగానుండుట మనరాష్ట్రకీర్తికి భంగకరమనియు, ప్రభుత్వము దీనిని నిరోధించుమార్గము లాలోచింపవలెనని యు సూచించుచున్నాను.

ఒకమధిరవాసి

---

## చాకపోకలు

కరోడ్గిరి నాజంగారు ౧౫-౨-౩౬ రోజు మోరాసైకిల్లో రాయచూరు, పోలాపూరు, తాండూరు మొదలగు స్థలములనుంచి ౨౭-౨-౩౬ నగరు హైదరాబాదునకు తిరిగివత్తురు.

విద్యాశాఖనాజంగారు ౧౧-౨-౩౬ రోజు ఉస్మానాబాదునకు దౌరాపైనేగిరి.

అబకారిశాఖ నాజంగారు ౧౧-౨-౩౬ రోజు నగరమునకు తిరిగివచ్చిరి.

విద్యా, రాజకీయశాఖల మంత్రులగు నవాబుమెహదీయార్జంగుగారు వరంగలు కరీంనగరములనుండి నగరమునకు తిరిగివచ్చిరి.

గుల్బర్గాకుదయచేసిన ప్రభువుగారు నిన్నటి దినాక అంతకుముందు బుధవారమురాత్రి ౧౨-౩౦ గం.కు నాంపల్లిస్టేషనులో నెగిరి.

గుల్బర్గాకు పోయియుండిన మహారాజా కిషన్ ప్రసాద బహద్దరువారు ౧౨-౨-౩౬ రోజు అల్వాలకు తిరిగివచ్చిరి.

నవాబు మొయినొద్దౌలా బహద్దరుగారు బొంబాయికి చికిత్సార్థము ౧౩-౨-౩౬న నేగిరి. పరిసెలూను మార్గమధ్యమున వారిజాగీరగు నా వందిలో ౧౦ నిమిషములాగినది. జాగీరుఉద్యోగులు నవాబుగారికి నజరానా లిచ్చుకొనిరి. వారము రోజుల్లో తిరిగి రాగలరని తెలియుచున్నది.

సరస్వతీభ్యాంకు డైరెక్టర్లగు శ్రీయుతులు, గోపాలరావు అడ్వోకేటు, వినాయకరావు, జనార్దనరావు (ఉన్నతన్యాయస్థాన న్యాయ వాదులు) పైభ్యాంకు జనరలు బాడీమీటింగు (మహాజనసభ) లో పాల్గొనుటకు గుల్బర్గాకు వెళ్లి, ౧౪-౨-౩౬ రోజు నగరమునకు తిరిగి వచ్చిరి.

---

### యూనాని వైద్యశాఖవృద్ధికై యత్నములు.

ప్రభుత్వ యూనాని వైద్యశాఖ వ్యవస్థకై భారతదేశములోని విఖ్యాత యూనాని వైద్యులు హైద్రాబాదుకు రప్పించబడియుండిరి. వారిగౌరవార్థము, రాజా ప్రతాపగిర్జిగారి బంగళాలో ౧౨-౨-౩౬ సాయంత్రం విందుబరుపబడెను. విందులో పేరుపొందిన స్థానిక ఆయుర్వేద, యూనాని వైద్యులును, ప్రభుత్వ ఉన్నతోద్యోగులును పాల్గొనియుండిరి.

---

## ఉద్యోగవిషయములు

ప్రభువుగారి ఫర్మానుచే శ్రీయుత వెంకటరావుదాతార్, ఫైనాన్సుసహాయకార్యదర్శిగారు ౧౭-౨-౩౬ నుండి ఉపకారవేతనము పొందెదరు. చాలకాలమునుండి వీరుతమపదవిని ఎంతోనిపుణతతో నిర్వహించిరి. వీరుతమపదవిని, ఒప్పటుమట్టును, సదరు మహాసబి మదద్గారగు జవాహరుఖాన్ గారికి ఇచ్చిరి. వీరిస్థానమున మిస్టర్ కొన్లినియస్ గారు (సదరుమహాసబి మదద్గారు) ఫైనాన్సులో పనిజేయుదురు.

నగరాభివృద్ధిశాఖనాజంఅగు మెహదీఅలి ఫాజలుగారు ఒక నెల సెలవుపైనేగనున్నారు.

ప్రభువుగారి ఫర్మానుఅనుసారం, వైద్యశాఖమంత్రుల పర్సనల్ అసిస్టెంటగు అబ్దుల్ ఖాదరు సా॥ రజ్వీగారు నవాబు సుల్తానుల్ముల్కుగారి సాయంగా సదరుకమిటీలో ఒకసంవత్సరమునకు పరీక్షార్థము సభ్యుడుగా నియమింపబడిరి. భృతి ౨౫౦ రూపాయలు.

మహారాజా కిషన్ ప్రసాద్ బహద్దరువారి ఆజ్ఞానుసారం గౌసుమొహి యొద్దీన్ సా॥ సివిలియన్ బందోబస్తు మదద్గారు నాజంగారు, ౪ సంవత్సరములకై జాగర్లబందోబస్తు స్కీము సందర్భమున జాగీరుబందోబస్తు శాఖనాయబు నాజంగా నియమింపబడిరి. వీరికి భృతి ౪౦౦ లున్ను ౫౦ రూ. సెటిల్మెంటు అలవెన్సు మంజూరుచేయబడినది.

---

### ఉస్మానియా విద్యాపీఠపు పరీక్షల తేదులు

ఉస్మానియా విద్యాపీఠపు రిజిస్ట్రారుగారి ప్రెస్నోటు ఈక్రిందివిధముగా నున్నది.

ప్రకృతి, రసాయనశాస్త్రపు ప్రాక్టికలు పరీక్షలు ఈక్రిందివిధముగా జరుగును.

౧. ఎఫ్. ఏ. వి ౧౦-౩-౩౬ నాడు. జిల్లాల విద్యార్థులకు ౧౩౪౫ ఫ. ౭ వ నెల ౧౫, ౧౬ తేదులలో

౨. బి.ఏ. బి. ఎస్ సి వి. ౧౧-౩-౩౬ ఫ. నాడు.

3. ఎం. ఎస్. సి. (ప్రథమ సంవత్సరము) వి ౧౦-౩-౩౬ ఫ. నాడు.

౪. ఎం. ఎస్ సి. (రెండవసంవత్సరము) వి ౧౦-౩-౩౬ ఫ. నాడు.

---

### మనరాష్ట్రములో ఫిల్ము డైరెక్టరు సంచారము

మిస్టర్ రఫీచౌదరీగారను ఫిల్ము డైరెక్టరు ఒకనెలనుండి వీరు హైదరాబాదులోనే యున్నారు. మొన్నవారు బీదరుకు పోయియున్నారు.

---

## బండియెద్దులతో సహా పరారైనదొంగలు

రహదారిలో కంటబడకుండుటకు వేసినఎత్తు

రేపల్లె ౩౦-౪-౫౬ ఫ —

ఈగ్రామము తాలూకపల్లిలో చేరినది ౪, ౫ రోజులక్రిందట యీగ్రామమునుండి వడ్డె వాండ్రడొక బండి, ఇదేగ్రామము మజూరాయగు రిమ్మరెడ్డిపల్లెనుండి రెండుయెద్దులను యెవరో ఒకరాత్రిదొంగిలించిరి. బహుశఃదొంగలు ఎద్దులనుబండికి కట్టుకొని పరారయివుందురు. కనుకనే పశువుల గొనిపోవుటయందు దొంగలకు రహదారిఅవసరము తప్పియుండునని ప్రజ లనుమానించుచున్నారు.

---

## ఓంకారేశ్వర పుస్తకభాండాగారము స్థాపన

మహారాజాబహాదరుగారి నందివనపర్తి జాగీరుగ్రామములో ఈమాఘ శు॥ ౫ జయవారం ఉదయం సుమారు ౧౦ గంటలకు శ్రీఓంకారేశ్వర దేవాలయములో శ్రీయుత బి.ఏ రామారావుగారి అధ్యక్షతక్రింద శ్రీఓంకారేశ్వరపుస్తకభాండాగార ప్రారంభోత్సవము జరుపబడినది ఈమహోత్సవమునకు గ్రామాధికారులు, పురజనులు సమీపగ్రామవాసులు సుమారు నూరుమంది హాజరయిరి

దేవాలయములో లలితా సహస్రనామపూజలు, బాలురచేత భజనలు జరుపబడినవి భాండాగారవృద్ధికై వారివారిశక్తికొలది సహాయము చేయుటకు వాగ్దానములు చేసిరి

---



# గ్రామ సమాచారములు

## రైలుపట్టాలపై స్త్రీశవము

అత్తగారింట దెబ్బలుతిన్నస్త్రీయట!

ఆసిఫాబాద —

రెండుమూడు మాసములక్రిందనే పెండ్లాడిన ఒక హిందూయువతి అత్తవారింట దూషింపబడి, రాత్రి రెండుగంటలకు సంసారముత్యజించిఅడవిత్రోవ పట్టినది అది రాజారామానిక్ గఢ్, బల్లార్షకు మధ్యనుండు ప్రదేశము ఇంకేమున్నది! సమయమురాత్రి- ప్రదేశమానిర్జనమైనఅడవి—అందులో యువతి—తెల్లవారి రైలుపట్టాలకడ చచ్చినపీనిగ మాత్రము కనబడినది ఎవరో తుపాకిలో చర్రాలువేసి కాల్చిచంపినట్లు అగపడెను. శవము పోస్టుమార్టం చేయబడినది.

ఈహత్యసందర్భమున రక్షకశాఖవారొకనిని పట్టుకొనిరి మొదటవాడు కిష్టయ్యనని చెప్పె, వాజ్మూలములో సయ్యదలియని మార్చుకొనెను. వానివాఙ్మూల మిట్లుండెను —

“నేను నిరుద్యోగిని! నాకుఎటుదోచక మాకోడి స్టేషన్ (మానికగడ్ తాలూకా) నుండి రైలుపట్టాలు పట్టుకొనివచ్చుచుండ, మానిక్ గడ్ నుండి పదికోసులదూరమున, ఒకచెట్టుక్రింద ఒకస్త్రీ కూర్చుండి ఏడ్చుటజూచి, దగ్గరకువెళ్లి విశేషముల నడిగితిని. మొగడు దెబ్బలుకొట్టి ఇల్లువెడలగొట్టిన సంగతి తెలిపినది ఆమెపేరు మైనాబాయి యనికూడా చెప్పినది. ఎంతోసేపు నచ్చచెప్పినతరువాత ఆమె నాప్రేమను అంగీకరించి నావెంటవచ్చినది. మేముకొంత నడచితిమో,లేదో కొందరుమాపైబడి, కొట్టి,తిట్టి, ఆస్త్రీని ఎత్తుకొనిపోయిరి” అతడు ఆస్త్రీ నెత్తురుబట్టలనుజూచి గుర్తించెను. రైల్వే రక్షకశాఖవారు సోదాజేయుచున్నారు ఈపట్టుబడినవానిని నాగపూరులోనున్న రక్షకశాఖ అధికారిగారికడకు గొంపోవనున్నారు ద.న్యూ

---

## లక్ష మంది హిందూ ముసల్మానులు గుల్బర్గా ఉర్సులో పాల్గొనుట

౯-౫-౫౬రోజు మఘన నిజాం ప్రభువుగారు దర్గాయొక్క దర్శనము చేసికొనిరి సాయంత్రం ౮-౪గంటలకు దర్గాలో గానము ఖవ్వాలివిని, దీపావళినిజూచి యానందించిరి ౧౦-౫-౫౬రోజు ఫాతెహా సమయమున ప్రభువుగారు దర్గాకువెళ్లిరి దర్గాయొక్క తలుపులకు వెండిరేకు వేయుటకు ఆజ్ఞనొసంగిరి, అందుకగు వ్యయము భరింతునని కూడా సెలవిచ్చిరి.

---

## శిశువును చిరుతపులి ఎత్తుకొనిపోవుట

అందోలువార్తలు

(విలేఖరి)

అందోలు ౪-౫-౧౯౪౭—

### పంటలపరిస్థితులు

అందోలు తాలూకాలో అబిపంటలు అర్ధభాగమునకు తక్కువగపండినవి సర్కారుపన్నులు చెల్లించుటకు చాలకష్టమైనది, మాలుగుజారిలో రైతులు మొరపెట్టుకొనిరి కానిఫలితమేమి తెలియలేదు

### ప్లేగు

జోగిపేటలో మూడుమాసములనుండి ప్లేగు వ్యాధి ప్రబలమైయుండెను. ఇప్పుడుకొంత తగ్గినది

### చిరుతపులి

అల్లాదుగఢ్‌మను గ్రామములో ఒకస్త్రీ రాత్రితొమ్మిది గంటలవేళ రెండుమాసముల బాలికను యింటిలో పరుండపెట్టి, పెద్దకుమారుని పిల్లవడ్డుంచి, మరియొక బాలునకు పాలిచ్చుటకు వెడలెను. ఆమె యిల్లువెడలిన కొంతసేపటికి పిల్లవాడు తల్లినివెదకుచు వచ్చెను. ఆదేసమయమున చిరుతపులి కుక్కను పట్టుటకైవచ్చి యింటిలోదూరి పసిపిల్లను యెత్తుకపోయెను తల్లి వచ్చిఆరాత్రియంతట వెతికెను పిల్లదొరకలేదు. మరునాడు గ్రామమువెలుపల తలపుర్రె, యెముకలు కనుపడినవి చిరుతపులి యడుగులను జూచిబాలికను భక్షించినదని నిశ్చయించిరి

---

# రాళ్లవానలు, ఘోరనష్టాలు

## నోటికివచ్చిన పైర్లు నీటగలిసినవి

### ప్రయాణీకుల రైలుపెట్టెలు పట్టాలనుండి తొలగుట

ఆసిఫాబాదులో పెద్ద గాలివానలు

ఆసిఫాబాదు ౧౦-౫-౧౯౪౫.

ఆసిఫాబాదు చుట్టుగ్రామములలో గాలివానలు ఎక్కువగానున్నవి. తీవ్రముగా గాలివీచుచున్నది ఒకానొకు ఈగల నెంబరు ౧౪౭ దిగువ (అనగా హైద్రాబాదులోకివచ్చు) మిక్సుడు ట్రేను సాయంత్రము ౭ గంటలకుతీవ్రముగా కురియుచున్న పెద్దరాళ్లవానచే పట్టాలనువదలిపోయినది. ఒకయింజను, ఒక సామానుడబ్బా తప్ప తక్కినప్రయాణీకుల డబ్బాలు అవలబడెను. ఐనా ప్రాణనష్టమున్మాత్రము కలుగలేదు. దగ్గరిస్టేషనునుండి సహాయము లభించెను. రైలు ట్రాకులు వెంటనే చక్కబరుపబడినవి. ఇపుడు రైల్వే రాకపోకలు యథావిధిగా జరుగుచున్నవి.

* * *

౭-౫-౪౫ రోజు వరంగల్లు, ఆచుట్టుగ్రామములలో రాళ్లవాన కురిసినవి. ధర్మారమను గ్రామములో రాళ్ళుపడి ఒకడు మరణించెనని కూడా వార్త వచ్చియున్నది.

* * *

నారాయణపేట ౯-౫-౪౫

నేటిరాత్రి పెద్ద రాళ్లవానపడినది. ఎన్నియో సిట్టలు మేకలు మొదలగునవి చచ్చినవి. నోటికివచ్చిన జొన్నపైరంతా నష్టమైనది. పడిన రాళ్ళకక్కొక్కటిగంతు లాలవరకుండెను.

* * *

బీదు ౯-౫-౪౫

౯-౫-౪౫ రోజు పెద్దరాళ్లవాన పడెను. రెండుతులాలు సాయంత్రముపరకు అపడ్డవడగండ్లను గంపలలో ఏరుకొనివచ్చి ౧ అణాలకు ఒక గంపచొప్పున అమ్మిరచుండిరి. వడగండ్ల దెబ్బడికి నదిలోని చేపలన్నియుచచ్చిఒడ్డున పడియుండుటయు, పురవాసులందరు వానిపై విరిగిపడుటయు తమాషాగానుండెను. చుట్టుముట్టు గ్రామాలు నేపురాయి, మంజ్లేగాంవుల లోగూడా జేనెడు నేల పైనవగండ్లునిలిచియుండెను. అక్కడకూడ జంతువులేగాక మనుష్యులుగూడా యీ వనగండ్లదెబ్బకు చచ్చిరి. నలిబాధ హెచ్చినది.

* * *

అంతేగాక, ఔరంగాబాద, ఉస్మానాబాద, హొన్లారంలలోగూడా పెద్దవానలుపడి ఇండ్లుకూలుట, చెట్లు వ్రేళ్లసహా పెకలించుకపోవుట, పశువులు చచ్చుట, పంటలు పాడగుట జరిగినది.

[ద. న్యూ.]

# కిరాయికు దొరకును

## రాయల్ హిందూహోటలులో ఒకభాగము

ఇది బ్రాహ్మణహోటలు పెట్టుటకు చాలా అనుకూలమైనది. నాంపల్లి స్టేషనునుండి ఇక్కడికి నాల్గు నిమిషముల ప్రయాణము.

ఈక్రిందిచోట విచారించుడు:—

రాయల్ హిందూహోటల్,
నాంపల్లిస్టేషను కెదురుగా,
హైద్రాబాదు (దక్కన్)

"ఓం"

## ప్రిమియర్ ఇన్షూరెన్సు అండుబిల్డింగ్ సొసైటీ, లిమిటెడ్

(ప్రభుత్వమువారివద్ద హామీగా ధరావతు డిపాజిటుగ ఉంచబడియున్నది.)

హెడ్ ఆఫీసు మద్రాసు.

నిర్మ్వలపై నూటికి రూ. ౬-౮ వంతున వడ్డీపై అప్పులిచ్చుట, ఇండ్లుకొనుట వీటికి సంబంధము లైన ప్రణాళికలు మా ప్రత్యేక లక్షణాలు. మావద్ద రూ. ౧౦ ల డిబెంచర్ల [ఋణ పత్రాల] పద్ధతి ఒకటి క్రొత్తది.

ఇదివరకు మాఅభివృద్ధి

| | |
|---|---|
| చేసిన జీవితభీమాలు | సుమారు రూ. 25,00,000 |
| వసూలైన కిస్తీలు | ,, 1,00,000 |
| పట్టాదారులకు మంజూరిచేయబడిన అప్పులు | ,, 1,50,000 |
| కొనబడిన డిబెంచరుల సంఖ్య | ,, 25,000 |

కావలయును

హైదరాబాదు సంస్థానములో ప్రతినిధులు లేని ప్రతిజిల్లాలో, ప్రతి ముఖ్యపట్టణములోను కమిషను, జీతములపద్ధతి మీద చీపుఏజంట్లు, ఏజంట్లు కావలయును.

ఇతర వివరములకై దరఖాస్తు పెట్టుడు:—

ది దక్కన్ కమర్షియల్ సిండికేటు, చీపు ఏజంట్లు, 501, సుల్తాను బజారు, జోషి బిల్డింగ్సు, హైద్రాబాదుదక్కన్.

లేక

మిస్టర్ జి. సౌందరరాజన్, బి.ఏ., బి.ఎల్., సంయుక్త కార్యదర్శి, 237, అంగప్పనాయకవీధి, జి. టి. మద్రాసు

# స్థానికవార్తలు

## సంతాననిరోధ ప్రచారము

సికింద్రాబాదులో మిస్ సేంజర్ గారి అధ్యక్షతన స్త్రీల సభ

౧౦-౨-౩౬వరోజు సాయంకాలము సికింద్రాబాదులో సంతాననిరోధ ప్రచారకురాలగు మిస్ సింగరుగారి అధ్యక్షతన ప్రత్యేకముగా స్త్రీలకొరకు సభజరిగినది. అందు విద్యార్థినులైన హిందూ మహమ్మదీయ స్త్రీలు వచ్చియుండిరి. సభ కార్యక్రమము ప్రారంభించుటకుముందు తలుపులలోనికి గడియ వైచుకొనబడెను.

"భారతదేశములో, అందు ప్రత్యేకముగా దక్షిణలో, స్త్రీలు అనాగరికులు, అసభ్యులు అని వినియుంటిని. ఇప్పటిది మిమ్ము జూచి అసత్యమని తోచుచున్నదని చెప్పుచున్నాను. సంతానాధిక్యమువల్ల బీదలు, మధ్యతరగతి కుటుంబీకులు పలురానిక్కట్ల పడుదురు. బాలబాలికలకు పుష్టికర పదార్థముల పెట్టుటను, ఉన్నత విద్యగరుపుటకు శక్తిలేక అధోగతులౌట మనము కన్నులార చూచుచు నేయున్నాము. అంతేగాక, తల్లులకు పిన్నవయస్సునసే ముసలితళపడును. నేడు సంతాననిరోధమువల్ల లాభమేఅని యందరు ఒప్పుకొనిన సంగతే. కాని ఆచరణవిధములో భిన్నాభిప్రాయము లున్నవి. మానసికశక్తివల్ల సంతాననిరోధము మంచిదైనను, అది నేడు అమలుపరాజాలదని సోదాహరణముగా జెప్పుచు, అందుకు యంత్రములనే ఉపయోగించి స్త్రీలు తాముబాగుపడి సంఘాన్ని బాగుచేతురని ఆశించిరి. తర్వాత చెప్పుచు ఆయంత్రములు విలువగలవికొట్టి ప్రతివారుకొని వాడుటకు వీలులేకుండుట జేసి ప్రభుత్వమువారు ప్రత్యేక ఆసుపత్రులు పెట్టింపవలయునని కోరుచు, హిందువుల స్త్రీ పునర్వివాహముల ప్రశంసించుచు ముగించిరి.

## నైజాం రైల్వే కార్మిక సంఘ కార్యదర్శి ప్రకటన

నైజాం రైల్వే యూనియను (సికింద్రాబాదు) కార్యదర్శులగు శ్రీయుత సోమయాజులుగారు మొన్నటి కార్మికుల లాకౌటు విషయమై ఈక్రింది ప్రకటన గావించిరి.

"... కొంతకాలమునుండి లాలాగూడా వర్కుషాపు కార్మికులు ఇక్కట్టుల బడుచున్నారు. అనుమానములనుండి మాత్రము వారి కష్టములు మరీహెచ్చుట అందరకు విదితమే. ఈవిషయమున పైయధికారులతో యూనియన్ వారు సంప్రతించిరి. వారికష్టముల బాపుమని విన్నవించుకొనిరి. కాని నిష్ప్రయోజనము. కార్మికులు పడ్డ కష్టములు మచ్చుకిక్కడ చూపబడుచున్నవి:—

జబ్బుపడువారిలో స్నానానుటకు సెలవు వేడిన, చచ్చినట్లు సర్టిఫికేటు తెచ్చినగాని సెలవు ఇచ్చుటకు వీలు లేదనిరి.

ఒకడు ౧౫ రోజుల సెలవువేడగా ౫ రోజులు మాత్రమే ఇవ్వబడును. ఇష్టపడనిచో పని చాలించుకొనుమనిరి. ఇంకొకడు తన కూతురి పెండ్లికి ౧౫ రోజులు సెలవువేడగా ౪ రోజులు మాత్రమే మంజూరు చేసిరి. తుదకు ౧౪౫౦ మంది కార్మికులు, వారికుటుంబముల కష్టనష్టములకు ఈ పైయధికారులే కారకులు. ఇప్పుడు యూనియను పైయధికారులమధ్య ఉత్తర ప్రత్యుత్తరములు జరుగుచున్నవి. రైల్వే ఏజంటుగారికిని రైల్వేబోర్డు అధ్యక్షులగు సర్ అక్బరుహైదరీగారికిని అపీలు చేయబడినది. న్యాయమైన తీర్పుకొగలదని కార్మికులు ఆశించుచున్నారు.

ప్రతిచోటను దొరకును — ప్రతిచోటను దొరకును

## సుగంధముగల మంచిగందపుచెక్కలు

బొగ్గుమొదలైనవి ఏవియు కలిసియుండ లేను,
శుద్ధచందనము మాత్రమే.
ఒకసారి వచ్చి పరీక్షించుడు

గమనిక: మావద్ద శుద్ధమైన భారతదేశీయమైన పౌడరు, అటో ఫీరోజు, పండ్లపొడి, నస్యము, ఇంగువ అమ్మబడును.

మావద్ద మంచిమాలు దొరకును-

దేవల్ అండుసన్సు, (౫౫౫) సదాశివపేట
ముఫవిల్ హౌడా, పూనా
ఏజంట్లు: పఠక్ అండ్ సన్సు, ౫౬౭౫
సుల్తాను బజారు, హైద్రాబాదు (దక్కన్)

H. P. H.

# కేరళసబ్బులు

ఘనతకెక్కిన రాజప్రతినిధియొక్కయు, మదరాసుగవర్నరు యొక్కయు పోషకత్వమున బజారులోని హిందూదేశపుసబ్బులకన్న కేరళసబ్బులు శ్రేష్ఠమైనవి. చందనసబ్బువెల తగ్గినది

ఏజంట్లు:—యం. బి. సుబ్బారావు అండుసన్స్,
మానుమార్కెట్టు
హైద్రాబాదు [దక్కన్]

# దేహ వ్యాయామమును గూర్చి ప్రత్యేక శ్రద్ధ

## నిజాంకాలేజి విద్యార్థులకు పింగిలి వెంకటరామా రెడ్డిగారి హితబోధ

నిజాంకాలేజ్ ఆంధ్రసారస్వత సంఘవార్షికోత్సవము

(స్వ.వి.)

గతవుధవారము (౧౪–౨–౪౦) నాడు (సాయంత్రం ౬ గంటలకు) మన నిజాంకాలేజిలోని ఆంధ్రసారస్వత సంఘవార్షికోత్సవము మిక్కిలి ప్రమోదముగా జరిగినది.

ప్రారంభమున మూర్తి దేశస్తవము మనోహరముగ పాడె డినది. తర్వాత శ్రీయుతకురుగంటి సీతారామయ్య, ఎం.ఏ. గారు పాడి ... గా శ్రీయుత పింగిలి వెంకటరామారెడ్డి దేశముఖుగారు అధ్యక్షతవహించి, అధ్యక్షోపన్యాసము సల్పిరి.

### అధ్యక్షోపన్యాసము

“ఆంధ్రసారస్వత సంఘసభాసదులారా!

నేటిసభకునన్ను అధ్యక్షునిగా ఎన్నుకొని నందుకు నేనుమీకు కృతజ్ఞతా వందనములర్పించుచున్నాను. మీవలె ఉన్నత విద్యాభివృద్ధికి అవకాశములునాకు లభింపలేదు. అయినను విద్యావిషయము లందునాకును అభిరుచిలేకలేదు. కనుక యువసోదరులును సోదరీమణులునగు మీతోగలసి నేటివిద్యా వ్యాసంగ సంరంభమున పాల్గొను అవకాశము నాకు మీరు లభింపజేసినందుకు నేనుధన్యుడను.

### ఆంధ్రసారస్వత సంఘము

మన నిజాముకళాశాలలో వివిధభాషలకు సంబంధించిన సారస్వతసంఘములు పనిచేయుచుండుట నాకు చాలసంతోష ప్రదము. అందులోను, గడచిన ముప్పదియైదు వత్సరములనుండి సుస్థిరముగా సాగుచు, సుమారు నూరుగురుసభాసదులుగలదై, ఆంధ్రసారస్వత సేవయొనర్చుచున్న మీసంఘము ఆంధ్రుడనగు నాకు అత్యంత హ్లాదావహమని చెప్పవలసిన పనియేలేదు. ముందుకు ఈసంస్థ యిట్లే వృద్ధినొందుచు కర్తవ్య పాలనమొనర్చుచు, మనరాష్ట్రములోని విద్యాసంస్థలకు భూషణమై ప్రకాశింపగలదని నేనాశించుచున్నాను. మీసంఘముపక్షమున మీరు నడపుచున్న యుద్యమము లన్నియు యోగ్యములగనున్నవి!

### వాగ్వివాద సభలు.

వివిధవిషయములను గురించిన జ్ఞానమును సంపాదించుట మానవుని కర్తవ్యము. అంతేకాదు. అట్టి యంశములను స్మరణయందుంచుకొనుట కూడ అవసరము. వాగ్వివాదసభలవలన కలుగు నుపయోగములలో ముఖ్యమైనది, వాదించువారికి తమ తర్కములోని లోపము అవగాహనయగుట. ఉభయవాదములను విను చుండుటవలన ఇది దృఢముగా బోధపడును. ఒక సంగతి జ్ఞప్తియందుంచుకొనదగియున్నది. అదేదన, వాగ్వివాదసభలలో నవలంబింపబడిన వాదములు, చేయబడు నిర్ణయములు నిర్బంధములు అనియు అనుసరింపదగినవియు అనియు తలంపగూడదు. అనుసరింపదగిన విధానములు ఏవియో, అవి జీవితకాలమున కలుగుచుండు అనుభవములనుబట్టి నిర్ణయించుకొనవలసి యుండును. మనమిట్లు వాదించితిమి కనుక అట్లే ఆచరించవలయునని పెడమార్గము పట్టగూడదు.

నేటి దినమున వాగ్వివాద సభలలో పాల్గొనినవారే రేపు దేశకార్యములను గురించిన మహద్విషయములపై తర్కవితర్కములు సల్పు సామర్థ్యముకలవారు కావచ్చును. ఇంగ్లాండులోని కేంబ్రిడ్జి ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయములందు విద్యార్థులుగానుండి వాగ్వివాద సభలలో వాక్చక్యము చూపిన యువజనులు ఎందరో, తరువాత ఆంగ్లసామ్రాజ్యమున ప్రధానమంత్రులుగా పనిచేసి కీర్తివహించిరనుట చరిత్రప్రసిద్ధమగు విషయము.

### నాట్య కళాశాఖ.

మానవహృదయముయొక్క వికాసమునకు ఈ కళ అత్యంతావసరమైనది. సంతోషించుటయొక్కయు, నవ్వుటయొక్కయు ప్రాముఖ్యమును అనేకులు ఎరుగకపోవచ్చును. మోటారుకారున కుల్ల్య ప్రికేటింగు ఆయిలు ఎట్లవసరమో, మానవ జీవితమునకు నవ్వు అట్లే అవశ్యకమైనది. నగుమొగముగల మనుష్యుడుగాని, ముఖవికాసముగల వైద్యుడుగాని దగ్గరకువచ్చినచో, ఎంతటిరోగికైనను కొంత చిత్తవిశ్రాంతి, కొంత యుపశమనము కలుగుచున్నది.

నాట్యకళామూలమున మానవుని యందలి యున్నియో యోగ్యతలు వ్యక్తము కాగలవు. అట్టివానివలన. వానిభవిష్యజ్జీవితమునకు సౌఖ్యముమాత్రమే కాక, దేశసేవకు సాధకములుకూడ దొరకవచ్చును. ఈ కళ అతిపురాతనమైనది. ఈ కళోపాసకులకు పాశ్చాత్యరాష్ట్రములందు గొప్ప గౌరవములు, బిరుదులు ప్రసాదింపబడుట సర్వజన విదితము.

ఇట్టి మనోజ్ఞమగు కళను మీరు అలవరచుకొనుచుండుట సంతోషావహము. ఇటీవలమీరు, మన విఖ్యాత విద్యాభిమానులగు రాజాబహదురు వెంకటరామారెడ్డి, ఓ. బి. ఇ. గారి పోషకత్వమున “వాహ్‌ వా” నాటకమొకటి ప్రదర్శించి క్వెట్టా భూకంప బాధితుల సహాయార్థము అర్పించి యుండుట మీ త్యాగబుద్ధిని, సంఘసేవాసక్తిని, దేశాభిమానముయొక్క వైశాల్యమును ప్రకటించుచున్నది.

### వ్యాస రచన.

ఈ రచనయొక్క ప్రాధాన్యత ప్రత్యేకమైనది. పనికొంత కఠినమైనది ; విషయమును గట్టిగా మనస్సునకెక్కించుకొనుట చేయుచున్నది. ఈపని చేయుటకు గ్రంథపఠనము, పరిశీలనము అవశ్యకములు. మాట్లాడునప్పు డుంచవలసిన యాలోచనకంటె, వ్రాయబూనినప్పుడు ఎక్కువయాలోచన కావలసియుండును. పదవాక్యసందర్భములు లిఖించుటవలన విషయపరిజ్ఞానము వ్యాప్తిచెందుటయేకాక, భావముల ప్రకటించు సామర్థ్యముకూడ హెచ్చును. ఆత్మ విశ్వాసము చెందును.

### పత్రికావిశేషకత్వము.

“లిఖితపత్రిక” యొకటి సంవత్సరమునకు రెండు మారులు మీరు వెలువడజేయుచుండుట, విద్యార్థిదశలోనే మీకు పత్రికారచనోద్యోగమునకు వలయు సామర్థ్యమును, అభిమానమును కలిగించగలదు. మీ పత్రికయందు రాజకీయేతరములగు సారస్వత, నైతిక, సాంఘిక విషయములుమాత్రమే యుండును గనుక దీనిని ముద్రింపించి ప్రకటించుటలో కట్టియాటంకముండజాలదు. అప్రకారము మీ పత్రికలు అచ్చయినపక్షమున వానికి వ్యాప్తి విశాలమై, పలువురకు లాభదాయకములై, ఇతరులందు రచనాసక్తి నిపురికొల్పగలదు.

### దేహపరిశ్రమ.

నేటి సమావేశము సారస్వత సంబంధమైనదైనను, విద్యార్థులగు మీతో ముచ్చటించు నీ సందర్భమున, దేహపరిశ్రమయొక్క ప్రాముఖ్యమును గురించి, మీకు శ్రద్ధకలిగింప వాంఛనన్ను తొందరపడుచున్నది. కాలేజీ జీవితమున మీరందరును ఈ విషయమున శ్రద్ధగైకొనుచునేయుందురు. అయినను, ఎంతశ్రద్ధయైనను దేహపరిశ్రమ విషయమున తక్కువయేయని మాత్రము చెప్పుచున్నాను.

### సంఘీభావము.

సంఘముల నిర్మించుకొనుటవలన నైకమత్యము వృద్ధిచెందుటకు మార్గమేర్పడుచున్నది. దీని యవసరము మనదేశమున ఎంతయోకలదు. ఇట్టి నిర్మాణములు మీయందు దెక్కువ సంఘీభావమును కూర్చునట్లు జాగ్రతపడవలయునని నా సూచన. ఈ విషయమున దీని సభ్యులు ఆంధ్రులవరకేకాక ఇతర భాషలవారగు మహారాష్ట్ర, కర్ణాటక, ఉర్దూ భాషల వారివరకును వ్యాప్తము కలిగింపబడుననియు, మీ యందరివి

౧౦ వ పేజీ చూడుడు

శ్రేష్ఠస్థానమగు విశ్వవిద్యాలయమువరకు వైశా ల్యమును పొందవలయుననియు నా నిశ్వాసము. నేటి ఈ ఘనాభిరామోహావి జీవితమునందు మీకు అత్యంతోల్లాసదాయకమైన దేశమునకును ప్రభువునకును ఉత్తమమగు సేవకాయ సామర్థ్యమును, ఉత్సాహమును పరస్పర సహకారమును మీ యందు ఉద్భవింపజేయుననియు, నేను ఆశించుచున్నాను.

## ముగింపు

మీరు చేయుచున్న సారస్వత సేవకుగాను, మిమ్ములను, ఉదాత్తములను నుపదేశముల చేతను, ఉదాహరణముల చేతను మీ హృదయముల ప్రబోధించుచున్న మీ అధ్యాపకమహాశయులను అభినందించుచున్నాము.''

ఈ యుపన్యాసము తరువాత, కార్యదర్శి సంవత్సరకార్య నివేదిక చదివివినిపించెను. దాని ముద్రిత ప్రతులు అందరికి పంచిపెట్టబడినవి.

## ఉపన్యాసము.

తరువాత శ్రీమాన్ దూపాటి వేంకటరమణాచార్యులు (హనుమకొండ కాలేజి సంస్కృతాంధ్రాధ్యాపకులు. విఖ్యాతచారిత్రిక పరిశోధకులు,) "కాకతీయవంశపాలనమున సారస్వతాభివృద్ధి" అను విషయమునుగూర్చి మహారసవంతమునను, చారిత్రిక విషయభరితమునునగు నుపన్యాసము సల్పిరి.

## బహుమానములు

పిమ్మట వ్యాసరచనమునందు అత్యుత్తమములుగా నిర్ణయింపబడిన విద్యార్థులకును, విద్యార్థినులకు, పుస్తకములు బహుమానముగా నియ్యబడినవి. బహుమాన మందినవారిలో శ్రీమతి యోగ్యశీలాదేవి, శ్రీమతిలిలీఅను ఇద్దరు విద్యార్థినులు నుండిరి. అంతకుముందే ప్రిన్సిపాలగు టర్నరు, ఎం.ఏ.గారు దయచేసిరి. పుష్పమాలాలంకృతులైరి.

## అల్పాహారములు

తరువాత అందరును లేచి అల్పాహారముల గొనిరి. దీనిలో కాలేజి ప్రొఫెసర్లును, ప్రిన్సిపాలుగారును, ఇతర అతిథులును పాల్గొనిరి. స్త్రీలకు ప్రత్యేక స్థలమున అల్పాహారము లమర్పబడినవి.

## "హాస్య నాటకము"

సుమారు ఆరుగంటలవేళ మరల సభ సమావేశమైనది. కామేశ్వరరావుగారిచే రచింపబడిన "బాగు.బాగు" "విద్యార్థుల పరీక్షా పతనము"అను ప్రహసనముల ప్రదర్శించిరి. కొందరు విద్యార్థులు మనోహరమగు గీతములపాడిరి. దేవదాసుఅను విద్యార్థి వినోదకరముగ నింగ్లీషులో సంభాషించిరి. దీనిలో నొక ఇంగ్లీషు పాటను, ఫ్రెంచివారు, ఆంగ్లేయులు, అమెరికనులు, కుంభకోణవాసియగు ఆచార్యుడు, పాడినవిధమును మిగుల అర్థవంతముగను, అభినయముతోను, ఆయాజాతులవారి సహజ స్వభావము తెలియవచ్చునట్లు పఠించిరి. రాత్రి ఏడున్నర గంటలవేళకు కీర్తిప్రదర్శనములు ముగిసినవి. నాట్యకళయందు ఉత్తములుగా నెన్నిన సత్యనారాయణ, కృష్ణమూర్తిగార్లకు పతకము లొసగబడినవి.

## ఉపసంహారోపన్యాసము

అధ్యక్షమహాశయు డిట్లు ఉపసంహారోపన్యాసము చదివెను.

"మిత్రులారా,

ఇంతటితో కార్యక్రమము నిర్విఘ్నముగా నెరవేరినది. మీరు సారస్వతమునకు చేయుచున్న సేవ శిరస్కరణీయము. భగవంతుడు మీకు జనదినాభివృద్ధి కలిగించి, మీలో నైకమత్యము, భ్రాతృభావము, పరస్పర సహకారము పెంపొందించు గాక యని ప్రార్థించుచున్నాను

శ్రీమాన్ వేంకటరమణాచార్యులు గారి యుపన్యాసము మనకు పూర్వపు ఆంధ్రభాషోన్నతిని, నిప్పుడే వినిపించినది. ఈవిధముగ నీసారస్వత తరువాతికాలపు నిరాదరణను స్పష్టపరచుచున్నది. ఇది చాల విచారకరమగు నంశము. శ్రీ ఆచార్యులవారు పలుశ్రమల కోర్చి తెలిసికొనిన విషయములు గంభీర భావములతో గూడినవి. వారిభావములు మనకు తోడ్పడదగినవి. వీరికి మనము కృతజ్ఞులమై యుండవలయును. మహరాష్ట్రములో ఆంధ్రభాషావ్యాప్తికి ఆంధ్రజన కేంద్రసంఘమువారిసేవ అమూల్యమైనది.

ఆంధ్రభాష దేశభాషలన్నిటిలో మహామధురమైనదని ప్రసిద్ధివహించినను, బంగాళీ, మహారాష్ట్రీలోనున్నంత సారస్వతము మన భాషలో లేదనియు, ఈవిషయమున కొరవది యున్నదనియు తామందరికి తెలిసినదే. ఇట్టి మన భాష నుద్ధరించుటకు కీ.శే. రావుబహదరు కీ.శేశలింగము పంతులు, బ్ర. శ్రీ. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, పానుగంటి లక్ష్మీనరసింహముగారును, ఇతర భాషాభిమానులును చేసినసేవ ఉత్కృష్టమైనది. దీనివలన ఆంధ్ర భాషావృక్షమునకు దోహదము కలిగినది. వీరివలెనే మనపండితులు కవులును, విద్యాధికులును ఎడతెగక కృషిసల్పినచో. కొలదికాలములోనే మన భాషయందలి సారస్వతముకూడ మహోన్నతదశకు రాగలదు.

నిజాంకాలేజి సారస్వతసంఘము, ఉత్తములగు సారస్వత సమారంభములను కూర్చినది. విఖ్యాతయశోవిరాజితులగు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి కుమారులచేత శతావధానము చేయింపబడినది. బహుగ్రంథరచయితలగు పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిని సన్మానించి కీర్తిగన్నది. శ్రీమాన్ దూపాటి వేంకటరమణాచార్యులవంటి పరిశోధకుల యుపన్యాసము సంఘమువరకు నిజాంకాలేజియందు ఆంధ్రసారస్వతమునకు అర్థకరముగ్గు ... ప్యారంగము నేర్పరచియుండుట ప్రశంసాపాత్రము. ఈకాలేజియందు పదిమందికంటెమించి ఆంధ్రసోదరీమణులు విద్యనభ్యసించుచుండుట చాలసంతోషప్రదము

శ్రీయుతులు కురుగంటి సీతారామయ్య ఎం.ఏ., నరిపల్లెవిశ్వనాథశాస్త్రి, ఎం.ఏ. గార్ల వంటి సారస్వత నిర్మాతలును, పండితప్రకాండులును ఈకాలేజియందు ఆంధ్రాధ్యాపకులుగానుండుట మనభాగ్యము. వారిమార్గదర్శకత్వమున విద్యార్థులును, విద్యార్థినులును మాతృభాషాసేవయొనర్చి, మనమాతృభారతికి ఆంధ్రసారస్వతవిషయమున వెనుకబడియున్న ఈనిజాం రాష్ట్రమున కొంతవంతమగు భవిష్యత్తును సంపాదింతురుగాక!

తరువాత శ్రీయుత రాజారావుగారు అధ్యక్షునకును, సభాసదులకును, నటకులకును, ఇతర సహాయకులకును కృతజ్ఞత దెల్పిరి.

## విశేషము

ఈవార్షికోత్సవములో బయటివారు పలువురు ఆంధ్ర విద్యార్థులును, సోదరీమణులునుకూడ వచ్చియుండుట చాలఉత్తమ ఉదాహరణము. దీనివలన ఆంధ్రవిద్యార్థులకును నగరములోని ఆంధ్రమహాశయులకును సమీప సంబంధమేర్పడుచున్నది. అధ్యక్షమహాశయులను బయటివారిని ఎన్నుకొనుటకు ఇదియే మొదలని తెలియుచున్నది. ఈపద్ధతి ఉస్మానియా విశ్వవిద్యాలయములోని ఆంధ్రసంఘమువారుకూడ అవలంబించదగినది. వారివరకు కొంతవరకు అవలంబించియే యున్నారు. ఆంధ్రభాషకు మననగరమున, అగ్రస్థానము లభించునట్లు పరమేశ్వరుడనుగ్రహించుగాక!

---

ఆంధ్రులకు
౧౦ లక్షల నైజాం
రాష్ట్రాంధ్రుల అభి-
వృద్ధికి ముఖ్యసాధనము
గోలకొండ పత్రిక
పొందుడు

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper for H.E.H. The Nizam's Dominions.

[illegible] ఏకైక [illegible] ఆంధ్రుల [illegible] గోలకొండ పత్రికలో ప్రకటనలకు

*Vol. 10.* | **Thursday 20—2—1936** | *No. 79*

## ఇటలీ అబిసీనియాల యుద్ధము

రోము. ౧౭-౨-౩౬

ఇంద్రెటాలో ఇటాలీయులకు జయముకలిగినందున ముసోలోని ఆజ్ఞపై నిన్నటిరోజు ఉదయమునుండి సాయంత్రమువరకు ప్రతిఇంట పతాకము లెగరవేయఁబడినవి- మంగళవాయిద్యములు మ్రోగుచున్నవి.

### మార్షల్ బడాగ్లియో

వీరొక ప్రకటన గావించినారు. "అంబ ఆరాడం, యుద్ధ సమాచారముల పేర్కొనుచు, అందుఅబిసీనియనులకు గొప్పఅపజయము కలిగినదనియు, వారియుద్ధపరికరములు ఇతరవస్తువులేగాక రాస్ ములోగెటాయొక్క ప్రత్యేక చిహ్నములుగూడా తనకు చిక్కినవనియు- అయుద్ధధారులకు ఫాసిస్టుఇటలీయోధులు అద్భుతముగా పోరాడి అబిసీనియా దేశానికి అశాంతిజనకమగు ఘోరాంచిన సైన్యముసే హతమార్చిరనియు తెల్పిరి.

రాస్ ములొగెటో సైన్యములిపుడు పరాజయమంది ఫహాగ్రా అంబాలగ్లా తట్టుపారిపోవుచున్నవనియు, ఈసేనగలపై ఇటాలీయ వైమానికులు బాంబులు వేయుచున్నారనియు బడాగ్లియో వార్తనంపిరని రోమునుండి వెడలిన ౧౭-౨-౩౬ తేదివార్త తెలుపుచున్నది.

### అడిస్ అబాబాకు తెలియదు

మకాలేకు దక్షిణమువజరిగిన యుద్ధము సంగతి ఇంకా అడిస్అబాబాకు తెలియకుండెను కాని తరువాత వచ్చినతంతిద్వారా, అక్కడా సంగతి తెలిసినట్లును, అబిసీనియనులకు చాల నష్టము కలిగినట్లును, అంబ్యనుపై ఇటాలీయుల ధ్వజమెక్కినదను వార్తను ఖండించినట్లును, అడిస్అబాబానుండి వెడలిన ౧౭-౨-౩౬ వార్త తెలుపుచున్నది.

### ముసులోనికి అమెరికావారి సాయమున

సెంటర్ పోప్పుగారి రేడియో ఉపన్యాసము

వాషింగ్టన్: ౧౫-౨-౩౬.-

అమెరికావారు ముసులోనికి వలయునంత నూనెను ఉచితముగా పంపుచుండుటచేత నే, ఈఇటలీ అబిసీనియా యుద్ధచక్రము నడుచుచున్నదని అమెరికా దేశపు [illegible] బాలగోపాల పెరిగిన విషయమే. నేస్కోరు ముసులోనీని ఆపుచున్న ఇతరదేశములన్నియు, అమెరికావారి విచిత్రమై నియమములేని, అయోమయ విదేశాంగనవవడివల్ల నష్టమగుచున్నవి." అని సెంటర్ పోప్పుగారు రుపన్యసించిరి. వీరు అమెరికాలోని ఒకనాయకులు.

### సికింద్రాబాదు జింఖానా గుఱ్ఱపు పందెములు

పై గుఱ్ఱపుపందెములు ౨౨ నుండి ౨౭ తేదీవఱకు జరుగగలవు.

## మాతృభాషలో విద్యనేర్పు విషయమున ఉస్మానియా విద్యాపీఠముయొక్క ఆదర్శము

రవీంద్రనాథ టాగూరుగారు మెచ్చుకొనుట

### పయనీరుపత్రిక ఖండించుట

బెంగాలు రాష్ట్రీయ విద్యావార సంవత్సరము న ఫిబ్రవరి వాతేదినాడు సాయంకాలము కలకత్తాలో సెనేటుభవనములో రవీంద్రనాథ టాగూరుగారు ఉపన్యసించుచు విద్యాబోధనలో రెండు ముఖ్యవిషయములను గమనింపవలెనని నొక్కిచెప్పిరి. ఒకటి జనసామాన్యమునకంతటకిని విద్య నేర్పుట, రెండు విద్యను మాతృభాషలలో నేర్పుట. మొదటియంశమును గూర్చి చెప్పవలె, కేవలము అనాగరిక జాతులుండు దేశములలో దప్ప నేటికి పతనంది మాత్రమే వ్రాయను. చదువు నేర్చియుండు పరిస్థితులు మరి ఏదేశమందును లేవనిరి. మన దేశములో ఇట్టిపరిస్థితులకు కారణము, నేర్పబడు విద్య జీవనోపాయములకు ఉపయుక్తము కాకుండుటయు, విద్య పరభాషలలో గఱుపబడుటయు నని చెప్పిరి.

"మాతృభాషలలో విద్య నేర్పుటవలన, విద్యను బాలురు సులభముగ నేర్చుకొనగల్గుదురు అందుచే ఎక్కువమంది విద్య నేర్చుకొనుటకు ప్రోత్సాహముండును. మాతృభాషలలో విద్య నేర్చుకొనుట కింకను సమయము రాలేదని వాదింప వీలులేదు.

ఇలన, హైదరాబాదు సంస్థానములో అన్ని సైన్సులును ఉరుదుభాషలో బోధింపబడుటలేదా? పరిస్థితు లనుకూలించుటలేదని కనిపెట్టుకొనియుండక మనముకూడ ప్రయత్నము చేయుట వివేకము." అనిరి.

* * * *

### ఏమి దురదృష్టము!

రవీంద్రుడు హైదరాబాదు సంస్థానమును గూర్చి చెప్పిన దానిపై పయనీరు పత్రిక విమర్శించుచు నిట్లువ్రాసెను: "డాక్టర్ టాగూరుగారు మాతృభాషలలో విద్యనేర్పు పద్ధతివలన (జాతీయైక్యతకు అటంకమగు) పచ్చిప్రాంతీయాభిమానము అతివేగముగ వృద్ధిజెందునని మరచినారు. ఉస్మానియా విశ్వవిద్యాలయము ప్రశంస నెత్తుట దురదృష్టమువలెను. ఎందులకనగా, అక్కడ ఏభాషలో విద్య నేర్పబడుచున్నదో అదెన్ని ఎంతమాత్రము హైదరాబాదు రాష్ట్రమున కంతటికిని మాతృభాషకాదు. అసలు మాట చెప్పవలసిన ఇతర ప్రాంతీయులకు ఇంగ్లీషు ఎంత పరభాషగా నున్నదో హైదరాబాదీయులకు ఉర్దు అంత పరభాష. ఉస్మానియా విద్యాపీఠము మాతృభాషలో విద్య నేర్పుటచే కలుగులాభములకు ఉదాహరణకాక దా

## బ్రాహ్మణార్థమువలె హరిజనార్థము

"హరిజనదాసు"గారి క్రొత్తభక్తి

సికింద్రాబాదు వాసియగు "హరిజనదాసు" (బాజీకృష్ణారావుగారు) ఇటీవల బ్రాహ్మణార్థ పద్ధతిపై హరిజనార్థమును జరిపిరి. తన ఇంటికి ఇరువుర హరిజన బాలురను పిలుచుకొనివచ్చి వారికి స్నానము చేయించి చొక్కాలు, చల్లడములు, టోపీలు, ధోవతులు ఇచ్చి తృప్తికరముగా భోజనముపెట్టించి, వారలతో గూడ తాను భోజనము చేసిరి. "హరిజనమాత" యని పేరు సంపాదించుకొన్నవారి పత్నియు ఇందు శ్రద్ధవహించెను.

కొన్నిరోజుల క్రిందట సికింద్రాబాదులో గుండా బాలకృష్ణయ్య [వర్తకుడు] బ్రా[illegible]ణులకు దక్షిణలు ఇచ్చియుండిరి. ఇది చూచి మన "హరిజనదాసు"గారుకూడ వారివద్దకు పోయి హరిజనార్థమునకై ఏమయిన నీయవలసినదని యాచించిరట. ఆవర్తకుడు రూ. ౧౦ లనిచ్చెనట. అది హరిజనులకై ఖర్చుచేయబడెను. ఎట్లు ఖర్చుచేయబడెనో మాకు తెలియరాలేదు.

## హైదరాబాదు ఫెడరేషన్‌లో చేరవలయునా?

### వరంగల్లు విద్యార్థుల చర్చ

౫-౫-౩౫ రోజు విద్యాశాఖా మంత్రులగు నవాబు మెహిదియార్జంగు బహద్దరుగారు, విద్యాశాఖాధ్యక్షులును వరంగలుకు కారుపై ఏగియుండిరి ౬-౫-౩౫ అచట కళాశాల, వసతిగృహము పరిశీలించిరి. "హైదరాబాదు ఫెడరేషన్‌లో చేరవలయునా?" అను విషయముపై విద్యార్థుల వాదసభ జరిగెను ౭-౫-౩౫ రోజు ఆటలపోటీలు, తేనీటివిందు, ఛాయాచిత్రము, రాత్రి నాటకము జరిగెను.

నికి వ్యతిరేకమైనదానికి ఉదాహరణగానున్నది. ౧౯౩౧ సంవత్సరపు జనపరిగణననివేదిక చూచినచో ప్రతిపదివేల మందిలో ౪౭౨౦ మంది జనులు తెలుగు మాట్లాడువారును, ౨౬౪౭ మంది మహారాష్ట్రభాష మాట్లాడువారును, ౧౧౨౨ మంది కన్నడభాష మాట్లాడువారును నైయున్నారు. డాక్టరుటాగూరుగారు వాదించునట్లు దక్షిణ హిందూస్థానములో ఉర్దువ్యాప్తి సుకరమైనచో భారతదేశమంతటికిని ఇంగ్లీషును వ్యాపింపజేయుటలో కష్టమేలయుండవలెను! ఇంతకు వాస్తవమేమనగా హైదరాబాదు సంస్థానము ఉర్దూలో విద్య నేర్పించుటలో దుష్ఫలిత పట్టుదల చూపినది"

## పురపాలక సంఘమువారికి రక్షకశాఖవారిసహాయము

పురపాలకశాసనముకూడా ఇతర శిక్షాస్మృతి(తాజీరాతు) శాసనములవలెనే పోలీసువారు చర్యగైకొనవలసినది. ఎప్పుడేని పురపాలక శాసనముక్రింద ఏదేని చర్యగైకొనబడుచుండునపుడు రక్షకశాఖవారు ఆదానిని పూర్తిచేయుటయు లేక చేయించుటయు విధియైయున్నదని," పురపాలక సంఘపు నాజింగారికో రికపై కొత్వాలుగారు తమ క్రింది రక్షకశాఖ అధికారులకు ఉత్తరవుచేసినారని తెలియుచున్నది.

## బియ్యపు గింజయందు జార్జిచక్రవర్తి బొమ్మ

బ్రిటిషు పారిశ్రామిక సంతలో హైదరాబాదుయొక్క పనితనము ప్రదర్శించబడుట

ఈఫిబ్రవరి ౧౭వ తేదినాడు లండనులో బ్రిటిషు పారిశ్రామికసంతలో భారతదేశములో చేయఁబడిన వస్తువులు ఎక్కువగా ప్రదర్శించబడెను. పోలోఆటకు కావలసిన పరికరములు, సిగరెట్లు, వృక్షసంబంధరసములతో చేసిన సబ్బులు, క్రొత్తక్రొత్తగా తయారు చేయబడినట్టివి ప్రదర్శనములో నుండెను.

ఒకక్రొత్తవింత ఏమనగా, హైదరాబాదు నుండి వచ్చిన మూడు బియ్యపుగింజలలో, ఒకదానియందు గత మే (౧౯౩౫) నెలలో జరిగిన రజతోత్సవ శాసనముతో సహా జార్జిచక్రవర్తియొక్కయు, మేరీమహారాణియొక్కయు బొమ్మలుండెను. ఇంకొకదానిలో తాజ్‌మహల్ బొమ్మయు, మూడవదానిలో జాతీయ గీతమునుండి కొన్ని పాదములును చిత్రించబడియుండెను.

### సరస్వతీ బ్యాంకువారి లాభములు

సరస్వతిబ్యాంకువారు తమ వాటాదారులకు నిరుటి సంవత్సరమునకై ౧౨ రూ. ప్రతిశత లాభముల పంచిపెట్టిరి.

### రహమబాదదక్కనుకు ఎక్కువ శక్తిగల యంత్రము

౧౫ ౫-౩౫

రహమబాదదక్కను [illegible] మిం గారి విన్నపముపై ౫ గుఱ్ఱముల శక్తిగల విద్యుచ్ఛక్తి మోటారు పదడు మున్సిపాలిటీ యందుకై పెంచుటకు పరిశ్రమ వ్యాపారశాఖ కార్యదర్శిగారి నుండి మంజూరు వచ్చినది

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K. Balakrishna Reddy.